# ఆంధ్ర గ్రంథములు.

ప్రతి 1-కి రూ. అ

| | | |
|---|---|---|
| గోపీనాథరామాయణము, సంస్కృతమునకు సరియైన తర్జుమా, కవనము మిక్కిలి సొంపు, పీఠిక విపులము, 2 సంపుటములు .... | 5 | 8 |
| చాటుపద్యమణిమంజరి .... | 1 | 4 |
| శకుంతలాపరిణయము .... | 0 | 10 |
| మార్కండేయపురాణము .... | 1 | 12 |
| సీతారామాంజనేయము, సటీక .... | 2 | 8 |
| నృసింహపురాణము .... | 0 | 12 |
| కాశీఖండము, శ్రీనాథకృతము .... | 1 | 8 |
| హరవిలాసము .... | 0 | 12 |
| నిరంకుశోపాఖ్యానము .... | 0 | 6 |
| కవికర్ణరసాయనము .... | 1 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక .... | 0 | |
| బసవపురాణము | | |
| చన్నబసవపురాణము | | |
| వీరభద్రవిజయము | | |
| శశాంకవిజయము | | |

వాసులు అ




# కృష్ణశతకము.

---

క. శ్రీరుక్మిణీశ కేశవ
నారదసంగీతలోల నరసఖ శౌరీ
ద్వారకనిలయ జనార్దన
కారుణ్యముతోడ నన్నుఁ గావుము కృష్ణా. 1

క. నీవే తల్లివి తండ్రివి
నీవే నాతోడునీడ నీవే సఖుఁడౌ
నీవే గురుఁడవు దైవము
నీవే నాపతియు గతియు నిజముగఁ గృష్ణా. 2

క. నారాయణ పరమేశ్వర
ధారాధరనీలదేహ దానవవైరీ
క్షీరాబ్ధిశయన యదుకుల
వీరా నను గావు కరుణ వెలయఁగఁ.... 3

క. హరి యను రెండక్షరములు
హరియించును పాతకంబు లంబుజనాభా
హరి నీనామమహత్త్వము
ముందర పొగడంగ వశమె ... ....14

క. క్రూరాత్ముఁ డజామిళుఁడు
నారాయణ యనుచు నాత్మనందను బిలువన్
ఏరీతి నేలుకొంటివి
ఏరీ నీసాటివేల్పు లెందును కృష్ణా. 5

క. చిలుక లోకరమణిముద్దుల
చిలుకను శ్రీరామ యనుచు శ్రీపతిపేరుం
బిల్చిన మోక్షము లిస్తివి
అలరఁగ మిమ్ముఁ దలఁచుజనుల కరుదా.... 6

క. అక్రూరవరద మాధవ
చక్రాయుధ ఖడ్గపాణి శార్ఙ్గి ముకుందా
శక్రాదిదివిజసన్నుత
శుక్రార్చిత నన్నుఁ గరుణఁ జూడుము.... 7

క. నందునిముద్దులపట్టిని
మందరగిరిధరుని హరిని మాధవు విష్ణున్
సుందరరూపుని మునిగణ
వందితు మిమ్ముఁ దలఁతు భక్తవత్సల.... 8

క. ఓకారుణ్యపయోనిధి
నా కాధారంబ వగుచు నయముగఁ బ్రోవన్
కేల యితరచింతలు
[illegible] లోకనాయక....

క. వేదంబులు గన నేరని
యాదిపరబ్రహ్మమూర్తి యనఘ మురారీ
నాదిక్కుఁ జూచి గావుము
నీదిక్కే నమ్మినాను నిజముగఁ గృష్ణా. 10

క. పదునాలుగు భువనంబులు
కుదురుగ నీకుక్షి నిల్పుకొని నేర్పరి వై
విదితంబుగ నా దేవకి
యుదరములో నెట్టు లొదిగియుంటివి.... 11

క. అష్టమి రోహిణిప్రొద్దున
నష్టమగర్భమునఁ బుట్టి యా దేవకికిం
దుష్టుని గంసు వధింపవె
సృష్టిప్రతిపాదనంబు సేయఁగఁ.... 12

క. అల్ల జగన్నాథుకు రే
పల్లియ క్రీడార్థ మయ్యెఁ బరమాత్మునకుఁ
గొల్లసతి యాయశోదయుఁ
దల్లియు నై చన్నుఁ గుడిపెఁ దనరఁగఁ.... 13

క. అందెలు గజ్జెలు మ్రోయఁగఁ
జిందులు ద్రొక్కుచును వేడ్క చెలు వారంగా
నందునిసతి యాగోపిక
ముందర నాడుదువు మిగుల మురియుచుఁ....14

క. హరిచందనంబు మేనను
గర మొప్పెడు హస్తములను గంకణరవముల్
ఉరమున రత్నము మెఱయఁగఁ
బరగితి వౌ నీవు బాలప్రాయము కృష్ణా. 15

క. పాణితలంబున వెన్నయు
వేణీమూలంబునందు వెలయఁగఁ బింఛం
శ్రేణీముత్యము ముక్కున
జాణఁడవై దాల్తు శేషశాయివి.... 16

క. మడుఁగుకుఁ జని కాళింగుని
పడగలపై భరతశాస్త్రపద్ధతి వెలయం
గడు వేడ్కతో నాడెడు
నడుగులు నే మదిని దాల్తు నచ్యుత.... 17

క. బృందావనమున బ్రహ్మా
నందార్భకమూర్తి వేణునాదము నీవుం
మందారమూలమున గో
విందా పూరింతు వౌర వేడుకఁ.... 18

క. వారిజనేత్రలు యమునా
వారిని జలకంబు లాడవచ్చిన నీవుం
జీరెలు ముచ్చిలి యిస్తివి
నేరుపరా యిదియు నీకు నీతియుఁ.... 19

క. దేవేంద్రుఁ డలుకతోడను
వావిరిగా రాళ్లవాన వడిఁ గురియింపన్
గోవర్ధనగిరి యెత్తితి
గోవుల గోపకులఁ గాచుకొఱకై కృష్ణా. 20

క. అండజవాహన విను బ్ర
హ్మాండంబుల బంతులట్ల యాడెడునీవున్
గొండల నెత్తితి వందురు
కొండికపనిగాక దొడ్డకొండా.... 21

క. అంసాలంబితకుండల
కంసాంతక నీవు ద్వారకాపురిలోనన్
సంసారిరీతి నుంటివి
సంపాదితవైరి సత్ప్రశంసిత.... 22

క. పదియాఱువేలనూర్వురు
సుదతులు యెనమండ్రునీకు సొంపుగ భార్యల్
విదితంబుగ బహురూపుల
విడువక భోగింతు వౌర వేడుకఁ.... 23

క. అంగనపనుపున ధోవతి
కొంగున నటుకులను ముడిచికొని వచ్చినయా
సంగతి విప్రున కిత్తివి
రంగుగ సంపదలు లోకరక్షక.... 24

క. హా వసుదేవకుమారక
కావుము నామాన మనుచుఁ గామిని వేఁడన్
ఆవనజాక్షికి నిస్తివి
శ్రీనర యక్షయ మటంచుఁ జీరెలు కృష్ణా. 25

క. శుభ్ర మగుపాంచజన్యము
నభ్రంకషపగిది మ్రోవ నాహవభూమిన్
విభ్రమ్మవై దనుజసుతా
గర్భంబులు వగులఁ జేయు ఘనుఁడా.... 26

క. జయమును విజయున కీయవె
హయముల ములుగోల మోపి యదలించి మహా
రయమున రొప్పవె తేరును
భయమున రిపుసేన విరిగి పాఱఁగఁ .... 27

క. దుర్జను లగునృపసంఘము
నిర్జింపఁగ వలసి నీవు నిఖిలాధారా
దుర్జనుల సంహరింపను
నర్జునునకు నీవు సారథ్యైతివి.... 28

క. శక్రసుతుఁ గాచుకొఱకై
చక్రముఁ జేపట్టి భీష్ముఁ జంపక చను నీ
విక్రమ మేమని పొగడుదు
నక్రగ్రహ సర్వలోకనాయక.... 29

క. దివిజేంద్రసుతుని జంపియు
రవిసుతు రక్షించినావు రఘురాముఁడ వై
దివిజేంద్రసుతుని గాచియు
రవిసుతుఁ బరిమార్చి తౌర రణమునఁ గృష్ణా. 30

క. దుర్భరబాణము రాఁగా
గర్భములో నుండి యభవ కావు మటన్నన్
నిర్భరకృప రక్షించితి
యర్భకు నభిమన్యుసుతుని నచ్యుత.... 31

క. గిరులందు మేరు వౌదువు
సురలందును నింద్రుఁ డౌదు చుక్కలలోనన్
బరమాత్మ చంద్రుఁ డౌదువు
నరులందును నృపతి వౌదు నయముగఁ.... 32

క. చుక్కల నెన్నఁగవచ్చును
గ్రక్కున భూరేణువులను గణుతింప నగున్
జొక్కపునీగుణజాలము
నక్కజముగ లెక్కపెట్ట నజునకుఁ.... 33

క. కుక్షిని నిఖిలజగంబులు
నిక్షేపము జేసి ప్రళయనీరధినడుమన్
రక్షక వటపత్రముపై
దక్షతఁ బవళించునట్టిధన్యుఁడ.... 34

క. విశ్వోత్పత్తికి బ్రహ్మవు
విశ్వము రక్షించఁ దలఁచి విష్ణుఁడ వనఁగా
విశ్వముఁ జెఱుపను హరుఁడవు
విశ్వాత్మక నీవె యగుచు వెలయుఁగఁ గృష్ణా. 35

క. అగణితవై భవ కేశవ
నగధర వనమాలి యాదినారాయణ యో
భగవంతుఁడ శ్రీమంతుఁడ
జగదీశ్వర శరణు శరణు శరణము.... 36

క. మగమీనమవై జలనిధిఁ
బగతుని సోమకునిఁ జంపి పద్మభవునకుఁ
నిగమములు దెచ్చి యిస్తివి
సుగుణాకర మేలు భక్తశుభకర.... 37

క. అందఱు సురలును దనుజులు
పొందుగ క్షీరాబ్ధిఁ దరువ పొలుపుగ నీవుఁ
అందం బగు కూర్మంబై
మందరగిరి నెత్తితౌర మాధవ.... 38

క. ఆదివరాహము నయ్యును
నాదనుజుహిరణ్యనేత్రు హతుఁ జేసి తగఁ
మోదమున సురలు పొగడఁగ
మేదిని వడి గొడుగు నెత్తి మెఱసితి.... 39

క. కెరలి యరచేతఁ గంబము
నరుదుగ నేయుటయు వెడలి యసురేశ్వరునిన్
బురమునఁ జేరి వధించితి
నరహరి రూపావతార నగధర కృష్ణా. 40

క. పడుగఁడవై మూఁడడుగులు
అడిగితి వౌ భళిర భళిర యఖిలజగంబుల్
దొడిగితివి నీవు మేనను
గడుచిత్రము నీచరిత్ర ఘనుఁడవు.... 41

క. ఇరువదొకమాటు నృపతుల
శిరములు ఖండించి తౌర చే గొడ్డంటన్
ధరఁ గశ్యపునకు నిచ్చియు
బరఁగఁగ జమదగ్ని రామభద్రుఁడ.... 42

క. దశకంఠుని బరిమార్చియుఁ
గుశలముతో సీతఁ దెచ్చికొనుచు నయోధ్యన్
విశద మగుకీర్తి నేలిన
దశరథ రామావతార ధన్యుఁడ.... 43

క. ఘను లగు ధేనుకముష్టిక
దనుజులఁ జెండాడి తౌర తగ భుజశక్తిన్
అనఘాత్మ రేవతీపతి
యనఁగా బలరామమూర్తి వెలసితి.... 44

క. త్రిపురాది దైత్యభార్యల
నిపుణతతో వ్రతముఁ జేసి నిలిపితి కీర్తుల్
కృపగలరాజవు భళిరే
కపటపు బుద్ధావతారఘనుఁడవు కృష్ణా. 4

క. బలువు గల తేజి నెక్కియు
నిలపై ధర్మంబు నిలుప హీనులఁ ద్రుంపన్
గలియుగము తుదను వేడుక
కలికివిగా నున్నలోకకర్తవు.... 4

క. వనజాక్షభక్తవత్సల
ఘను లగుత్రిమూర్తులందుఁ గరుణానిధివై
విను నీసద్గుణజాలము
సనకాదిమునీంద్రు లెన్నఁజాలరు .... 4

క. అపరాధసహస్రంబులు
నపరిమితములైనయఘము లనిశము నేనున్
గపటాత్ముఁడనై చేసితి
చపలుని ననుఁ గావు శేషశాయివి.... 4

క. నరపశువ మూఢచిత్తుఁడ
దురితారంభుఁడను మిగులదోషకుఁడను నే
గురు తెఱుఁగ నెంతవాఁడను
హరి నీవే ప్రావు దాపు వౌదువు.... 49

క. పరనారీముఖపద్మము
గురుతుగఁ గుచకుంభములను గొప్పనునడుమున్
అరయఁగఁ గని మోహింతురు
నిరతము నిను భక్తిఁ గొల్వ నేరరు కృష్ణా. 50

క. పంచేంద్రియమార్గంబులు
కొంచపుబుద్ధిని జరించి కొన్నిదినంబుల్
యించుక సజ్జనసంగతి
నెంచుచు మిమ్మెఱఁగినాఁడ నిప్పుడ.... 51

క. కష్టు ననాచారుని గడు
దుష్టచరిత్రుఁడను చాల దుష్బుద్ధిని నే
నిష్టములఁ గొల్వ నేరను
కష్టుని నను గావు కావు కరుణను.... 52

క. కుంభీంద్రవరద కేశవ
జంభాసురవైరి దివిజసన్నుతచరితా
యంభోజనేత్ర జలనిధి
గంభీరుఁడ నన్నుఁ గావు కరుణను.... 53

క. దిక్కెవ్వరు ప్రహ్లాదుకు
దిక్కెవ్వరు పాండవులకు దీనుల కెపుడున్
దిక్కెవ్వ రయ్యహల్యకు
దిక్కెవ్వరు నీవు నాకు దిక్కగు.... 54

క. హరి నీవె దిక్కు నాకును
సిరితో నేతెంచి మకరి శిక్షించి దయం
బరమేష్ఠి సురలు పొగడఁగఁ
గరిఁ గాచినరీతి నన్నుఁ గావుము కృష్ణా. 55

క. పురుషోత్తమ లక్ష్మీపతి
సరసిజగర్భాది మౌనిసన్నుతచరితా
మురభంజన సురరంజన
వరదుఁడ వగు నాకు భక్తవత్సల.... 56

క. క్రతువులు దీర్థాగమములు
వ్రతములు దానములు సేయవలెనా లక్ష్మీ
పతి మిముఁ దలఁచినవారికి
నతులితపుణ్యములు గలుగు టరుదా.... 57

క. స్తంభమున వెడలి దానవ
డింభకు రక్షించినట్టిదేవుని వెలయన్
అంభోజనేత్ర జలనిధి
గంభీరుఁడ నన్నుఁ గావు కరుణను.... 58

క. శతకోటిభాను తేజుఁడ
యతులితసద్గుణగణాఢ్య యంబుజనాభా
రతినాథజనక లక్ష్మీ
పతి హిత నను గావు భక్తవత్సల.... 59

క. మందుఁడ నే దురితాత్ముఁడ
నిందల కొడిగట్టినట్టి నీచుని నన్నున్
సందేహింపక కావుము
నందునివరపుత్ర నిన్ను నమ్మితిఁ గృష్ణా. 60

క. గజరాజవరద కేశవ
త్రిజగత్కల్యాణమూర్తి దేవ మురారీ
భుజగేంద్రశయన మాధవ
విజయార్చిత నన్నుఁ గావు వేగము.... 61

క. దుర్మతినై బలుకష్టపు
కర్మంబులు జేసినట్టికష్టుని నన్నున్
నిర్మలుఁ జేయఁగవలె ని
ష్కర్ముఁడ వని నమ్మినాఁడఁ గదరా.... 62

క. దుర్వారచక్రధర శర
శర్వాణీప్రణుతవినుత జగదాధారా
నిర్వాణనాథ మాధవ
సర్వాత్మక నన్నుఁ గావు సరసుఁడ.... 63

క. సుత్రామనుత జనార్దన
సత్రాజిత్తనయనాథ సౌందర్యకళా
చిత్రావతార దేవకి
పుత్రా నను గావు నీకుఁ బుణ్యము.... 64

క. బల మెవ్వఁడు కరిఁ బ్రోవను
బల మెవ్వఁడు పాండుసుతులభార్యను గావన్
బల మెవ్వఁడు సుగ్రీవుకు
బల మెవ్వఁడు నీవు నాకు బలమౌ కృష్ణా. 65

క. పరుసము సోఁకిన నినుమును
వరుసతో బంగార మైన నడువున జిహ్వన్
హరి నీనామము సోఁకిన
సురవందిత నేను నట్లు సులభుఁడఁ.... 66

క. ఒకసారి నీదునామము
ప్రకటముగాఁ దలఁచువారిపాపము లెల్లన్
వికలము లై తొలఁగుటకును
సకలాత్మ యజామిళుండు సాక్షియె.... 68

క. హరిసర్వంబునఁ గలఁ డని
గరిమతో దైత్యజుఁడు పలుకఁ గంబములోనన్
ఇర వొంది వెడలి చీరవె
శరణన్నవిభీషణుండు సాక్షియె.... 69

క. భద్రార్చితనిజచరణ సు
భద్రాగ్రజ సర్వలోకపాలన హరిశ్రీ
భద్రానుజ కేశవ వర
భద్రాధిప నన్నుఁ బ్రోవు భయహర.... 69

క. ఎటువలెఁ గరి మొర వింటివి
యెటువలెఁ బ్రహ్లాదు కభయ మిచ్చితి కరుణన్
అటువలె నను రక్షింపుము
కటకట నిను నమ్మినాఁడఁ గావుము కృష్ణా. 70

క. తటవిట లేటికిఁ జేసెదు
కటకట పరమాత్మ దుష్టఘంటాకర్ణున్
ఎటువలెఁ బుణ్యునిఁ జేసితి
వటువలె రక్షింపుమయ్య యచ్యుత .... 71

క. తురగాధ్వరంబుఁ జేసిన
పురుషులకును వేత్ర పదవి పుట్టుట యేమో
హరి మిముఁ దలఁచిన వారికి
నరుదా కైవల్యపదవి యచ్యుత .... 72

క. ఓభవబంధవిమోచన
యోభరతాగ్రజ మురారి యోరఘురామా
యోభక్తకామధేనువ
యోభయహర నన్నుఁ గావు మో హరి.... 73

క. ఓతండ్రి కనకకశ్యపు
ఘాతకునై యతనిసుతుని గరుణను గాచెన్
ప్రీతి సురకోటిఁ బొగడఁగ
నాతండ్రీ నిన్ను నేను నమ్మితిఁ.... 74

క. ఓపుండరీకలోచన
యోపురుషోత్తమ ముకుంద యోగోవిందా
యోపురసంహరమిత్రుఁడ
యోపుణ్యుఁడ నన్నుఁ బ్రోవు మోహరి కృష్ణా.

క. ఏవిభుఁడు ఘోరరణమున
రావణు వధియించి లంక రాజుగ నిలిపెన్
దీవించి యావిభీషణు
నావిభు నేఁ దలఁతు నేను అచ్యుత.... 76

క. గ్రహభూతదోషముఁ బొందదు
బహుపీడలు చేర వెఱచుఁ బాయును నఘముల్
ఇహపరఫలదాయక విను
తహతహ లెక్కడివి నిన్నుఁ దలఁచినఁ.... 77

క. గంగ మొదలైన నదులను
మంగళముగఁ జేయునట్టి మజ్జనములకున్
సంగతి గలిగినఫలములు
రంగుగ మిముఁ దలఁచుసాటి రావుర.... 78

క. ఆనందకాననంబునఁ
గోదండముఁ గాచినట్టి కోమలమూర్తిన్
నాపండ దాపు గన్గా
వేదండముఁ గాచినట్టి వేల్పుఁడ.... 79

క. చూపుము నీరూపంబును
పాపము దుష్కృత్యములెల్లఁ బంకజనాభా
పాపుము నాకును దయతో
శ్రీపతి నిను నమ్మినాఁడ సిద్ధము కృష్ణా. 80

క. నీనామము భవహరణము
నీనామము సర్వసౌఖ్యనివహాకరంబున్
నీనామ మమృతపూర్ణము
నీనామము నేఁ దలంతు నిత్యుఁడ.... 81

క. పరులను నడిగిన జనులకు
గుఱుచ సుమీ యగునటంచు గుఱుతుగ నీవున్
గుఱుచవు నై బలిచే మును
ధరఁ బాదత్రయముఁ గొంటి దక్షయు.... 82

క. పాలును వెన్నయు మ్రుచ్చిలి
ఱోలను నీతల్లి గట్ట రోషముతోడన్
లీలావినోది వైతివి
బాలుఁడవా బ్రహ్మకన్నఁ బ్రభుఁడవు.... 83

క. ఏఘడియును నీనామము
లఘుమతితోఁ దలఁచఁగలనె లక్ష్మీరమణా
అఘములు వాపుము దయతో
రఘురాముఁడ వైన లోకరక్షక.... 84

క. అప్పా యిత్తువు దయతో
నప్పాలను నతిరసంబు లనుభవశాలిన్
అప్పా ననుఁ గనుఁ గొనవే
యప్పా ననుఁ బ్రోవు వేంకటప్పా కృష్ణా. 85

క. కొంచపువాఁ డని మదిలో
నుంచకుమీ వాసుదేవ గోవింద హరీ
యంచితముగ నీకరుణకుఁ
గొంచెము నధికంబు గలదె కొంతయుఁ.... 86

క. వావిరి నీభక్తులకున్
గావరమున నెగ్గు సేయు గర్వాంధులకున్
దేవ వధించుట వింటిని
నీవల్లను భావ్య మయ్యె నిజముగఁ.... 87

క. అయ్యాపంచేంద్రియములు
ఉయ్యాలలు నూఁచినట్లు లూఁపక సేమన్
నీయాజ్ఞఁ దలఁగ నేరను
కుయ్యాలింపుము మహాత్మ కూరిమితోనఁ.... 88

క. కంటికి ఱెప్పవిధంబున
బంటుగదా యనుచు నన్నుఁ బాయక యెపుడుం
గంటుంచ వెరన నేలా
కంటక మగుపాపములను తెడచిగఁ .... 89

క. యమునకు నీక నే వెరువను
కమలాక్ష జగన్నివాస కామితఫలదా
విమల మగునీదునామము
సమరంగ దలంచెదను జేతు సమురంగఁ గృష్ణా.

క. దండమయా విశ్వంభర
దండమయా పుండరీకదళనేత్ర హరీ
దండమయా కరుణానిధి
దండమయా నీకు నిపుడు దండము.... 91

క. నారాయణ లక్ష్మీపతి
నారాయణ వాసుదేవ నందకుమారా
నారాయణ నిను నమ్మితి
నారాయణ నన్నుఁ బ్రోవు నగధర.... 92

క. తిరుమణి దురితవిదూరము
తిరుమణి సౌభాగ్యకరము త్రిజగములందున్
తిరుమణి పెట్టినమనుజుఁడు
పరమపవిత్రుండు భాగ్యవంతుఁడు.... 93

క. శ్రీలక్ష్మీనారాయణ
వాలాయము నిన్నుఁ దలఁతు వంద్యచరిత్రా
ఏలుము నను నీబంటుగఁ
జాలా నిను నమ్మినాను సరసుఁడఁ గృష్ణా. 94

క. శ్రీధర మాధవ యచ్యుత
భూధర పురుహూతవినుత పురుషోత్తమ నీ
పాదయుగళంబు నెప్పుడు
మోదముతో నమ్మినాఁడ ముద్దులకృష్ణా.... 95

క. శిరమున రత్నకిరీటము
కరమున నవశంఖచక్రఘనభూషణముల్
ఉరమున వజ్రపుపతకము
సిరినాయక యమరవినుత శ్రీహరి.... 96

క. అందెలు బాదములందును
సుందరముగ నిల్పినావు సొంపమరంగా
మందరధర మునిసన్నుత
నందునివరపుత్త్ర నిన్ను నమ్మితిఁ.... 97

క. కందర్పకోటిసుందర
మందరధర భానుతేజ మంజులదేహా
సుందరవిగ్రహ మునిగణ
వందిత మముఁ దలఁతు భక్తవత్సల.... 98

క. గోపాలదొంగ మురహర
పాపాలను బాఱఁదోలు ప్రభుఁడవు నీవే
గోపాలమూర్తి దయతో
నాపాలిటఁ గలిగి బ్రోవు నమ్మితిఁ.... 99

క. అనుదినము కృష్ణశతకము
వినినఁ బఠించినను ముక్తి వేడుకఁ గలుగున్
ధనధాన్యము గోగణములు
తనయులు నభివృద్ధి బొందుఁ దథ్యముఁగృష్ణా.

క. భారద్వాజసగోత్రుఁడ
గౌరవమున గంగమాంబకుమారుతుఁడన్
పేరు నృసింహాహ్వయుఁడన్
శ్రీరమయుత నన్నుఁ గావు సృష్టివి కృష్ణా! 101

శ్రీ కృ ష్ణ శ త క ము
సంపూర్ణము.

చెన్నపురి: వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు
ముద్రితము.—1918.

# సీతారామాంజనేయసంవాదము,

## సటీక.

అనేక నూతనవిషయములం జేర్చి చిన్నసైజున చక్కఁగ ముద్రించినారము. ఇదివఱకు ప్రకటితము లైన గ్రంథములకన్న మిక్కిలి బాగుగనున్నదని గ్రంథము చూచువారికి తెలియక పోదు. టీక మిక్కిలి విపులము. పీఠికలో కవిచరిత్రకూడ విపుల ముగ వ్రాయబడియున్నది.

సాధారణప్రతి 1-కి రూ. 1-8-0;

మేలుప్రతి 1-కి రూ. 2-8-0.

## చిత్రలేఖనము.

అభ్యాసకులకు మిక్కిలి యుపయోగకరము. ఆంధ్రమున నిట్టిగ్రంథ మిదివఱకు ముద్రితము కాలేదు. దీనినినిసాంతముగ చదువువారికి చిత్రలేఖనమునం దభిరుచి కలుగుట నిస్సంశయము. ప్రతిములనేకము లిందుగలవు. ప్రతి 1-కి రూ. 1-4-0.

# చాటుపద్యమణిమంజరి.

శ్రీ వేటూరి. ప్రభాకరశాస్త్రిచే సమకూర్పఁబడినది. ఇయ్యది ప్రాచీనాద్యతచాటుపద్యరత్నమాలకూర్పు. కథావృత్తాంతములు చక్కఁగా వ్రాయఁబడినవి. నీతి శృంగారహాస్య యుక్తి చమత్కారగర్భితములయినవి; చాటుధారలు, ఒక్కొక్క పద్యము లక్షవరహాలు!! శ్రీకృష్ణదేవరాయలు చాకలికి జవిూ యొసఁగుట మొదలగు చరిత్రవిశేషములును గలవు. మొనటి కూర్పు ప్రతులన్నియు అతిశీఘ్రకాలమున చెల్లిపోయినందున ఇంకను అనేకనూతన చరిత్రాంశములు, 750 క్రొత్తపద్యములఁ జేర్చి పునర్ముద్రణము చేసినారము.

ప్రతి 1-కి రు. 1-4-0.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు
అండ్ సన్స్,
198, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.